


"కూర్చోవచ్చా?"

ఆ ఆర్ద్ర స్వరం రవివర్మని ఈలోకం లోకి పిలిచింది.

"ఎంత ఆపినా ఆగలేదు సార్."

ఆ మాటలో బార్ బోయ్ అసహాయత uh వెలువడింది.

"ఓనర్ గారి ప్రైవేట్ ప్లేసని మొత్తుకున్నా సార్."

ఆ ఆవడిలో అతని సాక్ష్య వీక్షణ తృష్ణ వెన్నాడింది.

"అక్షరాలా నిజం," ఆగంతుడిలో అదే అర్ద్రత.

"సరే నువ్వెళ్ళు," రవిని వెనువీడని అసహనం.

"నాపేరు హరిప్రసాద్, హరి అంటారు."

"గేట్ క్రాషర్ అంటే సరిపోతుంది."

"క్షమించండి, ఇంత ఇబ్బందనుకోలేదు."

"సరే, కూర్చోండి, అనుభవిద్దుగాని."

"అంటే?"

"నా ఏడాది పాటి ఒంటరితనపు బరువు మీచేత మోయిస్తా."

"భలేవారే!"

"అయినా ఎందుకీ మొండితనం?"

"నచ్చింది పొందడానికి."

"ఇంటరెస్టింగ్, ఏమిటి ఇక్కడ నచ్చింది?"

"ఏంబియన్స్."

"యు గాట్ ఇట్, వెల్కమ్."

"థాంక్స్, కాస్త స్టీవార్డ్ని పిలుస్తారా, బోయిని ఎలాగూ బెంబేలు చేసేరు."

"చూస్తే మాటకారిలా వున్నారు."

రవి సైగ చయ్యడం, స్టీవార్డ్ హాజరవడం, హరి 'ఓల్డ్ మాంక్' లార్జ్ విత్ థమ్స్అప్ కోరడం, 'బెదిరిన' బోయ్ సెర్వ్ చెయ్యడం, అన్నీ క్షణాల్లో అయిపోయాయి.

"ఛీర్స్," రవి తన స్కాచ్ గ్లాస్తో.

"ఛీర్స్," హరి తన ఓల్డ్ మాంక్ జతకలూపుతూ.

"మనదేవూరు?"

"మాది భోపాల్, మీది ఇదే ననుకుంటాను."

"ఇక్కడికి వచ్చింది, కోడి గుడ్డుకి అదేదో అంటారే, అందుకనా?"

"వచ్చింది ఆడిటింగ్ పనిమీద కనుక ఇంచుమించుగా అదే లెండి."

"భోపాల్ అంటే భోపాల్ సన్యాసి కేసు గుర్తొస్తోంది, మా నాన్న చెప్పేవాడు."

"నేనూ విన్నా, కాని నేనయితే సంసారినే, మరి మీరు?"

"యాన్ అన్ సూటబుల్ బోయ్."

"అదేంమాట, చూడ్డానికి బాగున్నారు, ఉన్నవారి లాగే వున్నారు!"

'కానీ ఆడపదార్థం ఒకటుందని మరిచారు."

"ఆడదంటే అంత కినుకెందుకు?"

"దాని ప్రేమలో పల్టీ కొడితే తెలుస్తుంది."

"ఏమని?"

"ఆడది దగాసానని, ప్రేమకు సై, పెళ్ళికి నై."

"ఆ లెక్కన నేను మగాకోర్ని."

"కుండ బద్ధలు కొట్టినట్లుంది."

"మనసులో మాట అపరిచితుల గోడ దాటించ వచ్చు, చీకు చింతా లేకుండా."

"నిజమే, కానీ నాకు తట్టలేదు!"

"అయితే చెప్పండి."

"ఏమిటి?"

"గండికోట రహస్యం లాగా ఏమిటీ వంటరి వ్యవహారం?"

'ఇదే నేమో తీగలాగి డొంక కదల్చడం అంటే."

"పుల్లవిరుపు అయితే కాదు."

"డొంక తిరుగుడికి 'బీటింగ్ అరౌండ్ ద బుష్' లాగ పుల్లవిరుపుడుకి ఇంగ్లీష్ జోడుందా?"

"ఏదో ఒకటుండక పోదు లెండి. మాట మార్చి అసలు విషయం దాటేస్తున్నారు."

'ఏమిటది?"

"మాంత్రికుడి ప్రాణం చిలక హృదయంలో లాగ మీ దగాసాని రహస్యం ఈ ఫోటో ఫోల్డర్ లో దాగుందని ."

"నో మార్క్స్ ఫర్ గెస్సింగ్ ఇట్ రైట్," రవి టేబుల్ మీదున్న లెథర్ ఫోల్డర్ ని తెరుచు కుంటాడు.

"ఇన్సైన్స్పైర్ అయ్యారుగా, ఇక చెప్పండి."

"ఏమిటీ కూపీ లాగడం? 'తను' హైర్ చేసిన ప్రైవేట్ డిటెక్టివ్ లాగ."

"లీవ్ ఇట్ దెన్."

"జస్ట్ జోకింగ్."

"అయినా సొంత మామలా కనుక డొంక తిరుగుడు దోషం ఉండదు లెండి, ఇక చెప్పండి."

"ఈ కార్నెర్ టేబుల్ దగ్గరే మా తొలి పరిచయం, ఆన్ హర్ బర్త్డే బాష్ విత్ బీర్,"

రవి ఆ ఫోటో చూస్తూ చెప్పసాగాడు, "మా పరిచయం ప్రేమగా మారేక దీన్ని కోజి కార్నర్గా రేనోవేటే చేయించా, జస్ట్ ఫర్ బోతాఫ్ అజ్. తన డిగ్రీ రావడం తో వాళ్ళ నాన్న ట్రాన్స్ఫర్ కావడం, మా ప్రేమ కామాగా మారి క్రమేణా ఫుల్స్టాప్ అయింది. ఇప్పుడు మీకథకి కనెక్ట్ చెయ్యండి."

"దాని ముందర మీ 'తరవాత' చెప్పండి,"

"గోడలకే చెవులుండి మన సంవాదకీయాన్ని కథగా మలిస్తే, సస్పెన్స్ సున్నా అయి బోర్కొడుతుంది. సో, స్పైసిటప్ విత్ యువర్ లవ్."

"ఒకే బట్ విత్ రమ్." హరి ఖాళీ గ్లాస్ చూపిస్తాడు.

"వన్ మోర్ లార్డ్ బట్ యాజ్ మై గెస్ట్," రవి స్టీవార్డ్ కి సైగ చేస్తాడు.

"మేరా కహానీ మా పడోసి 'ఐ లవ్ యు' తో మొదలయింది." హరి రమ్ సిప్ చేస్తూ చెప్పాడు. "ఆమె ప్రేమలోని అనుభూతిని నా ప్రేమగా ఉహించేనని అది కేవలం రియాక్షనల్ ఎమోటివిజం అని తరువాత గ్రహించేను. తరువాత అదృష్ట వశాత్తు వేరే పరిచయం ప్రేమ రూపేణా, వజ్రం వజ్రేణ భేద్యతే అయింది. తరువాత కథ కంచికి. లేకపోతే ఆమానసిక స్థితిలో మనిషి వేసే తప్పటడుగులే తన జీవితాన్ని వక్రగతిలో నడిపిస్తాయి."

"లవ్స్టోరీని ఎంత నిర్మోహంగా నెరేట్ చేశారు! అయితే కంచి కన్యని పెళ్లాడుతానని చెప్పారా?"

"తను నాకా అవసరం కలగనిస్తే కదా, తనే పెళ్లి కలలు గుచ్చి ఇచ్చేది."

"అందుకని మీరు గిల్ట్ ఫ్రీ అంటారు."

"క్లియర్ థింకింగ్ అంటాను."

"ఆమె కోల్డ్ ఫీలింగ్ అనుకోవచ్చు కదా."

"అనుకోవచ్చు."

"నేనైతే ప్రమాణం చేశాను. మనసంటూ అంటూ ఉంటే తను జీవితాంతం క్షోభిస్తుంది."

"పెళ్లి చేసుకుంటానని అక్కడికేదో ఆమెని ఉద్ధరించి నట్లు చెప్తున్నారే." హరి అనునయ స్వరంతో అన్నాడు. "మన సమాజం లో పెళ్లి ఆశ చూపక పోతే ఆడది అసలు మగాడితో చనువు పెంచుకుంటుందా చెప్పండి. మరి మీరేమో ఆమె తాళి తెంచి నట్లు నొచ్చుకుంటున్నారు, అదేకాక శపించి పోస్తున్నారు. మీ వరస చూస్తుంటే మనదేశం లోను డేటింగ్ అవసరం అనిపిస్తోంది."

"అయితే ప్రేమ కేవలం అవకాశవాదమా?"

"నా దృష్టిలో పెళ్లంటే బస్సులో హడావిడిగ జేబురుమాలు పరిచి సీట్ సొంతం

చేసుగునే వ్యవహారం మాత్రం కాదు. తొలి ఆకర్షణే వివాహ యోగ్యం అనుకోవడం అవివేకం అని నా ఉద్దేశం. శారీరికత మానసికతని అన్వయించిన పెళ్లిలోనే ప్రేమ బతికి బట్ట కడుతుంది. ఆ కలయికే డెస్టినీ."

"మీరు మీ ప్రవర్తనను సమర్ధించు కుంటున్నారు. నామటుకు ప్రియుడి పిచ్చి ప్రియురాలికి రక్తి అయినదే ప్రేమ."

"ఒకప్పుడు ఈ 'గాలిబ్' వాసన నాకూ సోకింది, అంతకు మించి 'నీ ప్రేమలో సమిధనై' షైపు ఊకదంపుడు ఉర్దూ పోయెట్రీ మాహా ఇంపుగా ఉండేది కానీ ఇది 'మర్రి' వ్యవహారం అని గుర్తించి వదలించుకున్నాను."

"గాలిబ్ నే తీసి పారేస్తున్నారే!"

"నో రొమాంటిక్ వుడ్ డు దట్, తన సెంసిటివిటీ లెవెలే వేరు. తానన్నట్లు గాలిబ్ కా హై అందాజె బయాన్ ఔర్."

"గాలిబ్ ఊహ - ఆమెలా మరొకదుండ లేదు ఉండుంటే చూసుండే వాడిని - నా జీవిత బాట."

"ఉసే కౌన్ దేఖ్ సకతా యాగాన హై వ ఎకతా."

"వారెవ్వా, నా ఫీలింగ్స్ ని నేను ఫీల్ అయినట్టు ఫీల్ అవుతున్నారనిపిస్తోంది."

"ఆమే కాదు తన ఈ ఫోటో కూడా వేరొక ప్రింట్ లేదు. తనెంత అడిగినా ఇవ్వలేదు. తరువాత తన తలపే నా తోడయ్యింది," రవి ఆ ఫోల్డర్ లోంచి ఒక ఫోటో తీసి హరికి ఇస్తూ అన్నాడు.

"ఇటీజ్ ఎ స్మాల్ వర్ల్డ్, బహుశా సూర్యుడస్తమించని సామ్రాజ్యాన్నేలిన బ్రిటిష్ వాడికే ఇది తట్టుండచ్చు."

"యు మీన్ యు హావ్ సీన్ హర్!"

"రమ్య నా భార్య."

"ఓహ్ మై గాడ్!"

గ్లాస్ లో మిగిలిన స్కాచ్ ఒకే గుక్కలో తాగి రవి కుర్చీలో కూలబడి కళ్ళు మూసుకోగా హరి అతని భుజం మీద తన ఓదార్పు హస్తం చేరుస్తాడు.

"టేక్ ఇట్ ఈజీ రవి, జీవితం అనూహ్యం."

"సచ్ ఏ హార్డ్ బ్లో, వాటే ఫేట్!"

"కామ్ యువర్సెల్ఫ్."

"షేమ్ ఆన్ మి."

"మరి నా ఎంబరాస్మెంట్ సంగతేమిటి."

"సారీ హరి," రవి కళ్ళు తెరుస్తూ అన్నాడు.

'ఫాక్ట్ ఈజ్ స్ట్రేంజర్ దేన్ ఫిక్షన్ కి ఇది నిదర్శనం."

"నా కైతే ఇదంతా ఫిక్షన్లా వుంది."

"అయితే అప్రోచ్ ఇట్ విత్ సస్పెండెడ్ డిస్బిలీఫ్."

"వాట్ ఎల్స్ ఐ కన్ డు?"

"రమ్య నాకు ఈ పిక్చర్ గురించి చెప్పింది." హరి రమ్య ఫోటో చూస్తూ అంటాడు, "నేనెన్ని సార్లు క్లిక్ చేసినా తన దొకే మాట - ఆ ఫ్రేమ్ లో మూడే వేరులెండి - వెల్ షీ ఐజ్ రైట్."

"సేవింగ్ గ్రేస్."

"దటీజ్ లైఫ్," హరి తన సీట్ చేరి అన్నాడు.

"తెలుసుకోవచ్చా."

"ఏమిటి."

"మీరెలా కలిశారు?"

"చూడు రవి, చెప్తే నాకేమి నష్టం ఉండదు కాని వింటే నీకేమి లాభం కలుగదు."

"తెలుసు, కాని లూజర్స్ క్యూరియాసిటీ, రైట్."

"అయినా అడగక పోయినా ఒక చేదు నిజం చెప్పాలనుంది. అదీ నీ మంచి కోసమే."

"సరే చెప్పు."

"నువ్వు ఉహించుకుంటున్నట్టు రమ్య గిల్ట్ కాంప్లెక్స్ తో క్రుంగి కృశించటం లేదు. నా మటుకు తను నిన్ను మిస్ అవుతోందని ఎప్పుడు

అనిపించలేదు. సహేతు జీవనానికి ఇదే సహజ మార్గం, బహుశా సర్వత్రా ఇదే నడవడి అని నా అంచనా. భగ్న ప్రేమని రొమాంటిసైజ్

చేసుకుంటూ జీవించడం వ్యర్థం అని నా అభిప్రాయం. అలోచించి చూడు నీకే అర్థమవుతుంది."

"మిధ్య తొలగించినందుకు ఇదే నా ట్రీట్," సర్వర్ మీల్స్ తో ప్రవేశిస్తుంటే రవి అంటాడు.

ఎవరి ఆలోచనలో వారు భోజనమ్ చేసేక ...

"నా అభ్యర్ధన, మీరిద్దరూ నా పెళ్లికి రావాలి."

"సారీ రవి."

'ఎందుకని!"

"ఒక గ్లాస్ నీళ్లలో చిన్న మట్టిబెడ్డ వేసి చూడు. నీళ్ళని మురికి చేసిన కొంత సేపటికి మట్టి వాటం చేరుకుంటుంది, నీళ్లు తేటబడతాయి, కాని అదే గ్లాసుని కుదిపితే నీళ్లు తిరిగి మురికవుతాయి. ఇది గ్రహించే ఈవెన్ అజ్ జెంటిల్ మెన్ రిమైన్ కోల్డ్ టు దైర్ ఓల్డ్ ఫ్లేమ్స్, బ్లాగర్డ్స్ సీక్ టు ఇంఫ్లేమ్ దెమ్."

"ఇదే నా గురుదక్షిణ, ఫర్ తప్పటడుగుల సవరణ," రవి రమ్య ఫోటో ని ఫోల్డర్ లో పెట్టి హరికి ఇస్తాడు.

"థాంక్స్, హోప్ నో హార్డ్ ఫీలింగ్స్.'

"క్రమశిక్షణ అయిందిగా."

"గ్లాడ్, ఇది నా ఫస్ట్ డ్రింక్ కి విత్ టిప్ టు బేజార్ బోయ్," హరి 500 రూ నోటు టేబుల్ మీద పెడతాడు.

"వెల్కమ్."

"గుడ్ లక్ అండ్ గుడ్ బై."